To

**MY BROTHER**

**Late Mr. Kolichina Appayya Deekshitulu B. A.**

*District Court Vakil, Masulipatam.*

AS A TOKEN OF

**AFFECTION, ESTEEM AND GRATITUDE**

*This book is dedicated by*

G. RAGHAVA DEEKSHITULU.

(Author)

*Teacher A. E. L. M. Training School for Mistresses, Guntur.*

**1915.**



శ్రీరస్తు

# శుశ్రూష

## మొదటి ప్రకరణము.

గ్ర. రా:— పుస్తకము నందుఁ బ్రత్యే కముగాఁ జెప్పఁబడిన చోటులయందుఁ దప్ప తక్కిన చోట్లనెల్ల బాలునకుఁ జెప్పఁబడినది బాలికకునుకూడ వర్తింపఁ జేసికొనవలయును. సౌలభ్యముకొఱకుఁ బెక్కుచోట్ల బాలుఁడనియే వాడియున్నారము. విద్యార్థి శబ్దమును నిట్లే.

---

విద్యార్థుల తలిదండ్రులకు లోకవరిష్ఠు లకు, మఱియు వారి యోగక్షేమములఁ గోరువా

నెల్లరకుఁ దెలియఁజేయుట యేమనఁగా:—

ఈ పత్రము మీరు శాంతముగఁజదివి బాలుర ప్రకారంబా చేయుచున్నారో లేదో గమనించుచుండవలెను. బాలురయందు దేవిధమైన పొరపాటు, లేక తప్పిదము కనఁబడినను, లేక యితరులవల్ల తాము వినినను ఎంతమాత్రము నశ్రద్ధచేయక అందువలనఁగలుగు నష్టమును వారిమనమునఁ బట్టునట్టుబోధించి చెప్పవలెను. స్వవిషయములలోని బాలునిగొట్టి శిక్షించుటయే సన్మార్గమునకుఁ ద్రిప్పనుపాయమని యనుకొనరాదు. శిక్షకంటె సుబోధ యెక్కువ పనిచేయును. తప్పిదమునకు బాలుఁడు పశ్చాత్తాపముచేత నేడ్చునట్లు చేసినచో మేలుకలుగునుగాని దెబ్బలుకొట్టి నొప్పిచేత నేడ్చునట్లు చేసిన లాభము లేదు. బాలురయొక్క శ్రేయస్సును గోరుకొని యెల్లరును బాలుర యభివృద్ధికొఱకుపాధ్యాయులతో నేకీభవించి పనిచేయుట మిగుల అవసరము.

ఎవరిపిల్లలనువారు గారాబముగఁ బెంచుకొనుచుండెదరు. న్యాయమే. కానిపిల్ల కాకిముద్దు. గారాబము పెట్టుపోతలలోఁ జూపవలయును. బాలునియందుఁగల దుష్ప్రవర్తనమును దిద్దకముద్దు చేయుటమాత్రము ముందువృద్ధిలోనికి రావలసిన బాలురకుఁ జేచేత విషముత్రాగించుటయేగాని ప్రేమఁజూపుటమాత్రముకాదు. వ్యాధికలిగినపుడు పథ్యముచేయలేడని మందునీయకమాను దయార్ద్రహృదయులుందురా?

కనుక బాలురయందలి తప్పిదములను మఱుఁగుపఱచుట గారాబముగాఁ దలంచక చక్కదిద్దవలయును. బాలుర యభివృద్ధివిషయమైతల్లిదండ్రులే పట్టువిడచినచో 'కందకులేనిదురద చేమకేల' యను నట్లుపాధ్యాయులకు మాత్రమేమంత కాళ్లమీఁద గంజియొలికినది? వారికి బాలురమీఁద శ్రద్ధ యేబాంధవ్యమునఁ గలుగును? నూటికొక యుపాధ్యాయుఁడు శ్రద్ధవహించినను తలిదండ్రులతో

డ్పాటు లేనిది పిల్లలు బాగుపడుట దుర్లభము. చదువంటదు. సత్ప్రవర్తన కుదురదు. కనుక బాలుర విషయమై తలిదండ్రాదులు నుపాధ్యాయుడును కలిసి పనిచేయవలెను.

బాలురు బలవంతపెట్టినంత మాత్రమునఁ గాని, ఏడ్చినంత మాత్రమునఁగాని తలిదండ్రాదు లుపాధ్యాయులు నబద్ధపుచీట్లు వ్రాయరాదు. బాలురకుఁ దగిన యోగ్యతలేనపుడు పైతరగతిలోనికి వేసికొనుఁడని తలిదండ్రాదు లుపాధ్యాయులను, పాఠశాలాధికారులను కోయుంబవచ్చు వెంటఁబడి దీనాలాపములచే వేధించుటకంటె మొదటినుండియుఁ బిల్లలచేత శ్రద్ధగాఁ జదివించుట యుత్తమము. క్షేమకరము. గౌరవము.

## రెండవ ప్రకరణము.

1 బడియున్న దినములన్నియు తప్పకుండ ప్రతి పూఁటను వేళమించకుండ హాజరయ్యెదను.

2 ఇంటియొద్ద పెద్దవారు ఊరకుమని చెప్పినప్పుడు ఉపాధ్యాయుని యొద్దకువచ్చి సెలవుపుచ్చుకొని వెళ్ళెదను.

3 జబ్బుచేత గాని జాలిపోయిన యెడల, వచ్చినప్పుడు పెద్దవారియొద్దనుండి సెలవుచీటి తెచ్చెదను.

4 ఆలస్యముగ వచ్చినప్పుడు ఇంటియొద్దగల పెద్ద వారిచేత చీటీని వ్రాయించుకొని వచ్చెదను.

5 ఏపూటటి పాఠముల నాపూటటి తప్పకుండ గట్టిగ జదువుకొని వచ్చెదను.

6 నేను బడికిరానిసమయమున నాతరగతిలో జరిగిన పాఠములు, ఇయ్యబడిన లెక్కలు మొదలయినవానిని నాతరగతి బాలుర నడిగి తెలిసికొని, నేర్చుకొనవలసినవానిని నేర్చుకొని, వ్రాయవలసిన పాఠములు, కాపీలు, లెక్కలు మొదలయిన వానిని వ్రాసికొని పాఠశాలకు వచ్చెదను. అట్టిపాఠములు నాకు రావనిగాని వానిని చెప్పినపుడు నేనుతరగతియందు లేననిగాని అనను.

7 ఇంటియొద్దఁ జదువుకొనుటకును వ్రాసికొనుట
కును వీలులేనియెడల ఆసంగతి ఇంటియొద్ద పెద్దల
వల్ల ఉత్తరము వ్రాయించుకొని వచ్చెదను.
8 ఇంటియొద్దకు ఇచ్చిన లెక్కలు మొదలైనవానిని
నేను స్వంతముగఁ బ్రయత్నము చేసెదను.
9 నాకుఁ దెలియని యెడల ఇతరులను గాని ఉపా
ధ్యాయునిగాని అడిగి నేర్చుకొనెదను. ఇతరుల
యొద్ద నేర్చుకొనినపుడు ఆసంగతి తరగతిలోనికి
రాగనే ఉపాధ్యాయునితో ముందుగాఁ జెప్పెదను.
10 బడిలోఁ గాని బయటఁ గాని ఎన్నడును 'కాపీ'
చేయను.
11 ఇతరులు నన్నేపాఠమైనను అడిగినపుడు వారికిఁ
జెప్పి ఆసంగతి యుపాధ్యాయునితోఁ దరగతి
లోనికి రాగనే చెప్పెదను.
12 నాచేతనైనంతవఱకు ఇతరులకు మంచివిషయ
ములలో సహాయము చేయుదును. బద్ధకించను.
13 పెద్దవారికిఁ గోపము వచ్చుపను లెప్పుడును చేయను.

14 నాకంటెఁ బెద్దవారితో మాటలాడు నపుడు మర్యాదగ, నిదానముగ మాటలాడుదును.

15 ఎవరితోను అబద్ధము లాడను.

16 నాకంటెఁ బెద్దవారికి మనస్సు విసుగు పనులెప్పుడును చేయను.

17 ఎవరిని గురించియు చాటునఁగాని ఎదుటఁగాని దూషణగా మాటలాడను.

18 కాలము వ్యర్థముగాఁ గడపను.

19 నాకంటెఁ బెద్దవారు వలదనినపని నెప్పుడును చేయను.

20 తరగతియందున్నపుడు ఇతర బాలురతో నెప్పుడును మాటలాడను.

21 కాగితములు మొదలయినవి చించి తరగతియందెపుడును క్రిందఁ బారవేయను.

22 గోడలమీఁదను తలుపులమీఁదను ఏమియు వ్రాయను.

23 ప్రతిదినమును తప్పక స్నానము చేయుదును.

24 మాసినగుడ్డలను ధరింపను.

25 వీధిలో ఎప్పుడును పరుగెత్తను.

26 వీధిలో ఎప్పుడును కేకలువేయను.

27 మాయింటియొద్ద తప్ప వీధిలో ఎప్పుడును ఆడుకొనను.

28 పెద్దవారు చెంత లేనప్పుడును, వారుచెప్పనప్పుడును ఎత్తుప్రదేశములకు ఎక్కను.

29 ఇతరుల వస్తువులను దొంగిలింపను.

30 ఇతరుల వస్తువులలో ద్వారాగా పడిపోవువానిని నాయొద్ద నుంచుకొనను. అట్టివానిని నేను [illegible] [illegible]

31 రాత్రి నిద్రపోవుటకు ముందును ఉదయము నిద్రలేచిన తక్షణమును దేవునితప్పక ప్రార్థించెదను.

32 నా పుస్తకములను మాపను.

33 కాగితములలో అనవసరమయిన గీతలను గీయను.

గాని కూర్చొనను.

43 స్త్రీలు బూట్సు తొడుగుకొనినప్పుడు తప్ప సాధారణము చెప్పులు తొడుగుకొని నప్పుడు వానితో తరగతిలోఁ గూర్చొనను.

44 ఉపాధ్యాయుల సెలవుకొనకుండ తరగతి విడిచి వెళ్ళను.

45 ఎచటను ఉమ్మివేయను

46 చూచువారికి అసహ్యకరమైన పనులను చేయను.

47 పెద్దలయెదుట నవ్వుచుకూర్చొనను.

48 పెద్దలతో నవ్వుచు మాటలాడను.

49 కుచ్చువిడిచి తలగుడ్డ చుట్టుకొనను.

50 కోటునకు గుండీలు పెట్టకుండ విడువను.

51 అందరిని ప్రేమింతును.

52 ఎవరిమీఁదను చాడీలు చెప్పను.

53 ఏజంతువులకును బాధకలుగఁజేయు పనులను చేయను.

54 పొగాకు, చుట్ట, బీడి, సిగరెట్ మొదలగువాని

ధ్యానములు చేసికొనను.

55 చీట్లాట, పులిజూదము మొదలగుఆటలనాడను.

56 చాకగాదొరుకు వస్తువులను విడచి వెలగల వానిని కొనను.

57 ఎవరివద్దను అప్పుతీయను.

58 మీటింగులు మొదలగుచోట్లకు వెళ్లినపుడువివిధమైన అల్లరియు చేయను.

59 మీటింగులోఁ జెప్పఁబడు విషయములునాకుఁ దెలియవని యెఱిఁగియున్నపుడు ఆమీటింగు లోనికి పోను.

60 పొరపాటున వెళ్ళిన యెడల ఒకరియుపన్యాసము మధ్యగా లేచిరాను.

61 నాకంటెఁ బెద్దవారు మాటలాడుచుండగా నన్ను అడుగనిదే జోక్యము కలిగించుకొనను.

62 ఎవ్వానిని ఒట్టుపెట్టుకొనను.

63 పేదవాండ్రకు, కుంటివాండ్రకు, గ్రుడ్డివాండ్రకు నాచేతనైన సహాయము చేయుదును.

64 మడఁచుటకు వీలులేనికత్తులు, కలములు, మేకులు మొదలగువానిని జేబులలో నుంచుకొనను.

65 ఇతరుల పోట్లాటను వినను.

66 ఇతరులను మోసముచేయను.

67 ఇతరుల ఉత్తరములను, డైరీలను, పద్దుపుస్తకములను వారియుత్తరువులేనిది చదువను.

68 నాశరీరమునకు దెబ్బతగులునట్టియు, నాయొద్దగాని చుట్టుప్రక్కలగాని ఉండువస్తువులు చెడిపోవునట్టియు పనులను చేయను.

69 చెఱువులు, బావులు, నదులు, కోనేళ్ళు మొదలగువానిలో ఎప్పుడును దిగను.

70 ఆవులు, ఎద్దులు, గేదెలు, గుఱ్ఱములు మొదలగువానియొద్ద కెప్పుడును పోను.

71 చెడ్డపిల్లలతో సహవాసము చేయను.

72 మాఅమ్మగారియెదుటఁగాని మాఅప్ప చెల్లెండ్ర యెదుటఁగాని ఉచ్చరింపఁగూడని మాటలను ఎక్క

టను ఉచ్చరింపను.

73 నా పలకలను పుస్తకములను, పెన్సిళ్లను, కలములను, మిగుల జాగ్రతగా నుంచుకొనెదను. శుభ్రముగ నుంచుకొనెదను.

74 ఆఁకలి కానిదెప్పుడును భుజింపను. కావలసిన దానికంటె ఎప్పుడును ఎక్కువ తినను.

75 అన్ని విధములచేతను మంచిపేరు తెచ్చుకొనుటకుఁ బ్రయత్నించెదను.

## మూడవ ప్రకరణము.

ఉపాధ్యాయులారా,

మనము కేవలము 'నిజదారసుతోదర పోషణార్థమై' యుద్యోగములు చేయుచున్నామని తలఁపరాదు. మనమొక మేనేజర్లకే కాదు, పాఠశాలయందలి బాలురకందఱకును సేవకులము. మనవల్ల విద్యావిషయికమైన పనిబుచ్చుకొనుటకుఁ బ్రతి విద్యార్థికిని హక్కు కలదు.

బాలురకుఁ జదువు, వ్రాఁత, లెక్కలు, భూగోళము మొదలగుపాఠములను నేర్పినంతమాత్రమున మానవిధాయకకృత్యము నెరవేరినదని తలంపరాదు. బాలుర నన్నివిధములఁ సన్మార్గప్రవర్తకులుగా నొనర్చుభారమునందొక సగము తలిదండ్రులమీఁదను మఱియొకసగముపాధ్యాయులమీఁదను నాధారపడియున్నది. బాలుర తలిదండ్రులు గ్రామాంతరముల నుండిరేని యారెండు సగభాగముల భారమును ఒకయుపాధ్యాయుని మీఁదనే నాధారపడియుండును. మనుజుఁడెంత విద్వాంసుఁడైనను సద్గుణములలవడవేని యాతనికా విద్యవలనఁ గలుగవలసిన సంపూర్ణఫలము కలుగలేదని తలంచవలయును.

కొందఱు బాలురు తమ తలిదండ్రుల యెదుటను, తమతరగతి యుపాధ్యాయుల యెదుటను చక్కఁగనేయుండి, ఇతరుల యెదుట దుష్టకార్యములను (చుట్టలు, బీడిలు, సిగరెట్లు మొదలగునవి త్రాగు

మంచివారు పదిమందియుండినఁ జాలును. చెప్ప వలసినచో నొప్పునఁ జెప్పితినేగాని కుమారులయందలి దుర్మార్గమును మాన్పవలదని చెప్ప తలిదండ్రు లుందురా?

శరీరమునకుఁ దల యెంత ముఖ్యమైన అంగమో, పాఠశాలకుఁ గ్రమశిక్షయు నంతముఖ్య మైనయంగము. క్రమశిక్ష (Discipline) లేని యెడల నుపాధ్యాయుఁ డెంత తెలివికలిగి బోధించి నను, ఎంత శ్రమచేసి చెప్పినను బూడిదలో హోమము చేసినట్లేగాని లాభమేమియు లేదు. కనుక పాఠశాల యందుఁ గ్రమశిక్షను చక్కఁగాఁ గాపాడుకొన వలెను. మఱువకుఁడు. అశ్రద్ధచేయకుఁడు. ఉపేక్షింపకుఁడు. సర్వేజనాః సుఖినోభవంతు.

## నాలుగవ ప్రకరణము.

బాలురను సన్మార్గమునకుఁ ద్రిప్పుటకుఁ గొన్ని సాధనములు:—

1 ఉపాధ్యాయులు విద్యార్థులచేత డైరీ వ్రాయించుచుండవలెను. వారమున కొకతడవయైన వాడైరీలను తాముచదివి సంతకములను చేయుచుండవలెను.

2 విద్యార్థులయొద్ద ప్రత్యేకమైన నోటుబుక్కులు ఉంచి వానిలో నతని నడతను గురించి గారవస్థులచేత నప్పుడప్పుడు వ్రాయించుకొని వచ్చుచుండునట్లు చేయవలెను. ముఖ్యముగా బోటింగులందలి పెద్దమనుష్యులచే వ్రాయించుకొని వచ్చునట్లు చేయవలెను. వానినప్పుడప్పుడుపాధ్యాయులు చదివి సంతకములు చేయుచుండవలెను.

3 విద్యార్థులలో మైనర్లు ఒంటరిగా ప్రయాణము చేయునప్పుడుపాధ్యాయుని యొద్దనుండిగాని లేకతలిదండ్రాదుల యొద్దనుండిగాని అధికార పత్రము పొందియుండవలెను. ఆఅధికారపత్ర మడిగిన గారగస్తులకుజూపుచుండవలెను. ఇట్లుచేయుటచేత

*For copies apply to:-*

**G. R. DEEKSHITULU,**

**Teacher, GUNTUR.**

ఈపుస్తకములకు

గుండు రాఘవదీక్షితులు

టీచర్, గుంటూరు.

అని వ్రాయవలెను.

